# "RAZARULO SURYUDU"

FREE VERSE OF

**RAAVI RANGA RAO**
LECTURER IN TELUGU,
A. J. COLLEGE OF EDUCATION,
MACHILIPATNAM. A.P. 521 001. (INDIA)

**SAAHITHEE MITRULU,**
MACHILIPATNAM.
PUBLICATION No. 9

FIRST PRINT : May 1997
PRICE : Rs. **40/-**

For Copies :
**NARRA PRABHAVATHI,**
27-431, PAATHA RAMANNAPETA,
MACHILIPATNAM. A.P. 521 001. (INDIA)
Phone : (08672) 21345.

---

Printed at Brundavan Offset Printers, Buttaipet, Machilipatnam.
Phone : 21204 (O); 22832 (R)

# నిత్య చైతన్య కృషి

రేజరులోని బ్లేడు గడ్డం మురికిని తొలగిస్తుంది. మనిషిలోని చైతన్యం, పోరాట స్ఫూర్తి దేశంలోని అవినీతిని, అక్రమాల్ని తొలగించాలి. ఇది ఓ రోజు చేసి ఊరుకునేది కాదు. అవినీతి పెరిగినప్పుడల్లా ప్రజాపోరాటాలు రావాలి - గడ్డం పెరిగినప్పుడల్లా రేజరుకు పని చెపుతున్నట్లు.

అదే ఆశయంతో రావి రంగారావుగారు రచించిన ఈ 'రేజరులో సూర్యుడు' ను మేము ప్రచురిస్తున్నందుకు ఆనందిస్తున్నాం.

గత 18 ఏళ్ళుగా ఆంధ్రజాతీయ బి.ఇడి. కళాశాలలో తెలుగు లెక్చరరుగా పని చేస్తున్న రంగారావుగారు రాసిన 'తెలుగు బోధనాప్రదీపక' - తెలుగు బోధన పద్ధతుల గురించి రాసిన పుస్తకం ఉత్తమ ప్రమాణాలను కలిగి ఉండి రాష్ట్ర ప్రభుత్వ ప్రశంసక ఉత్తర్వులు కూడా పొందింది.

రంగారావుగారికి కవిత్వం రాయడం ఎంత ఇష్టమో రాయించడం కూడా అంతే ఇష్టం. పిల్లల చేత కవిత్వం రాయించే ఎత్తుగడల గురించి ఆయన చేసిన కృషికి 1991 లో N.C.E.R.T. వారి జాతీయ బహుమతి లభించింది. 1985 లో రాష్ట్ర ప్రభుత్వ ఉగాది పురస్కారం కూడా అందుకున్నారు. 'సాహిత్య క్రీడలు' అనే ప్రక్రియను రూపొందించి విద్యార్థుల చేత, యువకుల చేత కవిత్వం రాయిస్తున్నారు. ఈ విషయం మీదే ఆయన యం.ఫిల్. చేశారు. ఇంకా దీనిమీదే పి.హెచ్‌డి. కొనసాగిస్తున్నారు. 'మచిలీపట్నం సాహితీమిత్రులు' ప్రతి నెలా 2వ శనివారం సాహిత్య కార్యక్రమాలు క్రమం తప్పకుండా చక్కగా కొనసాగటానికి మొదటి నుంచీ అంకిత భావంతో కృషి చేస్తూ వస్తున్నారు.

1980 నుండి 90 దాకా మినీ కవితా ప్రచారాన్ని ఒక ఉద్యమంగా స్వీకరించి రాష్ట్రమంతటా విశేషంగా రంగారావుగారు పర్యటించారు. ఆయన 'మినీపోయెం ట్రెండ్‌సెట్టర్'.

ఆయన కవిత్వం రాయడం మొదలుపెట్టి 25 సంవత్సరాలు నిండిన సందర్భంగా 'భారతి' మొదలైన పత్రికల్లో మినీకవితగురించి ఆయన రాసిన వ్యాసాలు, అనేక పత్రికల్లో వచ్చిన మినీకవితలు, సాహిత్య వ్యాసాలు... ఈ సంవత్సరమే ప్రచురిద్దామని మహాప్రయత్నంలో వున్నాం. సాహితీప్రియులంతా మాకు సహకరిస్తారని ఆశిస్తున్నాం.

**వేమూరి రాధాకృష్ణమూర్తి**
కన్వీనర్, సాహితీమిత్రులు
మచిలీపట్నం.

ఆచార్య **కొలకలూరి ఇనాక్**
తెలుగుశాఖ
శ్రీకృష్ణదేవరాయ విశ్వవిద్యాలయం
అనంతపురం.

# కంగ్రాచ్యులేషన్స్

శ్రీ రావి రంగారావుగారూ !
కంగ్రాచ్యులేషన్స్.
మీ 'రేజరులో సూర్యుణ్ణి' చూశాను.
వెలుతురై నవ్వుతున్నాడు.
అభివ్యక్తి మీ అంతరంగంలా అందంగా ఉంది.
ఆత్మీయతకు అక్షరరూపం మీ కవిత.
దేశ మంటే ఎంత ప్రేమ మీకు!
పొల మంటే ఎంత భక్తి మీకు!
వంతెన ప్రతిభ ఎవరి సొంతమూ కాదు.
చెట్టు చైతన్యానికి మెట్టే, పరాభవం రాదు.
వాళ్ళు ఇంకొకడికంటే ముందు పుట్టి ఏం సాధించారు?
వీళ్ళు దేన్నీ ప్రేమించలేరు.
డబ్బును మోస్తున్న మనుషుల తలలు నిలువవు.
ధర్మం తాకలేని గుండెలు వెలుగవు.
భూమినీ, తల్లినీ, కవినీ, కర్షకుణ్ణి ప్రేమించే మీకు
పత్తిచేను ప్రపంచమై కరచాలనం చేస్తుంది.
సూర్యుడు సబ్బుబిళ్ళయ్ మీ స్నానం గదిలో ఎదురొతాడు.
జండా ఊడిన కర్ర మీ చేతిలో తుపాకీ అవుతుంది.
నాగరికతను నాకేస్తున్న పీడకుల వంచనమీద
మీ కవితా సూర్యకిరణాలు ఖడ్గాలై చెండాడుతాయి.
మీ కవిత్వంలో మీ హృదయం ఎవరెస్టుజండా ఐ ఎగురుతుంది.
మీ అక్షరాలు వీధిదీపాల్లా దేశమంతా చూపుతాయి.
మీ కవిత్వం ఆలోచనల్లా సూర్యసౌందర్యం అందిస్తుంది
మీ సాహిత్యం జాతి ప్రభాతరీతి
మీ గీతి అక్షర విభూతి

శుభాకాంక్షలతో...

మీ

ఆచార్య **కొలకలూరి ఇనాక్**

# అవినీతివ్యవస్థమీద ఆగ్రహజ్వాలలు ఎగిసిపడాలి



సతము చిగురించు 'అమృత వృక్షమ్ము' నేను - అంటూ పద్యాలు పాడినది రంగారావుగారే. మినీకవితలకు 'గుడ్ మార్నింగ్' చెప్పినది రంగారావుగారే. మనిషి మానసిక మాలిన్యాన్ని తొలగించటానికి వచన కవితల 'ముఖంపుల్ల' తయారుచేసినది రంగారావుగారే. ఒక మంచి ప్రయోగంగా 'కలలో కవిత' రాసినది రంగారావుగారే. కుర్చీ రాజకీయాల కుట్రలను చెండాడుతూ 'సూర్యుళ్ల గెలుపు' ప్రకటించినది రంగారావుగారే. ఈనాటి అవినీతి వ్యవస్థమీద ప్రజలు తిరుగుబాటు చేయాలని, దానిమీద ప్రజల అగ్రహ జ్వాలలు ఎగిసిపడాలని ఆశయంతో పదేళ్ల తర్వాత ఇప్పుడు 'రేజరులో సూర్యుడు' అందిస్తున్నది కూడా రంగారావుగారే.

రంగారావుగారితో పరిచయం జరిగింది నాకు పాతికేళ్లకు ముందు తిరుపతిలో, నా 'కామధేను' పక్షపత్రిక కార్యాలయం అనబడే కాఫీపొడి అంగడిలో. ఆయన అప్పుడు తిరుపతిలో తంతి తపాలా శాఖలో చిరుద్యోగి. చిన్న చిన్న కవితలు రాసి చూపిస్తుంటే 'ఇలా కాదు - అలా' అని చెప్పిన వాడిని. ఈరోజు ఆధునిక కవితా రీతులను ఆయన వద్ద గ్రహించవలసిన స్థాయికి రంగారావుగారు ఎదిగిపోవడం నాకు గర్వకారణం.

భాషలో స్పష్టత... భావంలో గుప్తత... ఉపమానీకరించడంలో నవ్యత... ఈ కావ్యం పేరులోనే ఒక నవ్యత, 'రేజరులో సూర్యుడు'. ఈనాడు దేశంలో ఎక్కడ చూసినా కుంభకోణాలు, స్కామ్‌లు... ఏనాడు లేనంతగా అవినీతి నిర్భయంగా బతికేస్తోంది. ఇందుకు కారణం 'మనకెందుకులే' అనే ప్రజల 'నాగరిక' వైఖరి. ప్రజలు నిజాన్ని గొంతెత్తి చెప్పడంలేదు. అక్రమాల్ని చూస్తూనే తప్పకొని పోతున్నారు. ఈ పరిస్థితి కొనసాగితే రేపు రోడ్డుమీద ప్రజలు నడవలేని దుస్థితి దాపురిస్తుంది. మనుషులెవరూ బతకలేని దుర్గతి ఏర్పడుతుంది. అందుకే తమ బాగుకోసం, సమాజం బాగుకోసం ప్రజలు నోరెత్తాల్సిన అవసరం నే డేర్పడింది. ఆ చైతన్యం ప్రజలలో తేవాలనేది రంగారావుగారి కవితల తపన. పాఠకులకు ఈ కవితలు అర్థమయితేనే స్పందించగలుగుతారు. అందుకే ఆయన మరీ సంక్లిష్టమయిన వ్యక్తీకరణ విధానాల్ని ఎంచుకోనందుకు అభినందించాలి.

రంగారావుగారి ఈ కవితల సంపుటికి రెండు లక్ష్యాలున్నాయి. ఒకటి, కొత్త వ్యవస్థ రావటం. అది తరవాత జరిగేది. ఆ వ్యవస్థ వచ్చేదాకా మనిషి చేతలుడిగి కూర్చుంటే అది రాకపోవటమే కాక మనిషే బతికే స్థితి ఉండదు. ఈ వ్యవస్థలోని

అవినీతిని, అక్రమాల్ని మనిషి ఎదిరించటం తక్షణం జరగాల్సిన పని. ఇది రెండో లక్ష్యం. ప్రాథమిక చికిత్సలాంటిది. ఈ వ్యవస్థ మారితీరాలని కోరుతున్నవాళ్ళు కూడా కొందరు ఈ అవినీతిని వ్యతిరేకించే ఉద్యమాలపట్ల పెద్దగా ఆసక్తి చూపకపోవటం శోచనీయం. కుంభకోణాలు చేస్తున్న నాయకులు, అధికారులు తమ అధికారాన్ని దుర్వినియోగం చేసి మళ్ళీ మలినం అంటని పెద్ద మనుషులుగా ముద్రలు వేయించుకుంటున్న దుస్థితి ఉన్నా ప్రజాగ్రహం వెల్లువలా వస్తుంటేనే న్యాయస్థానాలు కూడా ధైర్యంగా దుష్టరాజకీయాల్ని ఎదుర్కొనే ప్రయత్నం కొంతైనా చేయగలుగుతాయి. అందుకే ఎలా ఆలోచించినా అవినీతిపట్ల ప్రజలు మండిపడాలి. దేశం ముఖంమీద పెరుగుతున్న అవినీతిమాలిన్యాన్ని మనిషి 'రేజరులోని సూర్యుడు' తొలగించాలి. దేశం ముఖం అందంగా వెలగాలి. రంగారావుగారి ఆశ నెరవేరాలని ఆకాంక్షిస్తున్నా.

తిరుపతి
21-5-97

పులికంటి కృష్ణారెడ్డి

## చేతులెత్తి మొక్కుతూ...

*అవకాశ మొస్తే అందరూ ఆరగించేవాళ్ళేనంటే నేనొప్పుకోను. ఒకరా, ఇద్దర, ముగ్గురా, నలుగురా... అన్ని రంగాలలోనూ కొంతమంది ఉన్నారు. ఆ సామాజికభక్తులకు కృతజ్ఞతలతో...*

*రావి రంగారావు*



శిరీషను చేపట్టిన

కడియాల వెంకట్‌కు

(Software Engineer, U.S.A.)

పెండ్లి కానుకగా

శుభాశీస్సులతో

బాబాయి

# రేజరులో సూర్యుడు

అర్ధరాత్రి స్వతంత్రం వచ్చేసిందని
ఆనందం మత్తులో
ప్రపంచమంతా తెల్లారుతున్నవేళ
నిండా దుప్పటి కప్పుకొని
చీకటిలో మంచుగడ్డలా
నిద్రపోతున్నాడు నా మానవుడు

నిటారుగా నిలబడి బద్ధకాన్ని
వదిలించుకోవాలి మనిషి !
ముఖంమీద పేరుకున్న చీకట్లను
నరికేసుకోవాలి మనిషి !

రేజర్లోంచి సూర్యుడు
మండిపడుతూ ముందు కురకాలి
ఖండాలమీద మాసిన దైన్యం
కరిగికరిగి జారిపోవాలి

మొలుచుకొస్తున్న ముళ్ళపొదల్ని
కత్తిరించుకోలేనివాడు
తన ప్రాణాల్ని దాచుకొనే గుండెకాయ
ఈ దేశాన్ని రక్షించుకోలేడు

అనుక్షణం మనిషి
అప్రమత్తుడై ఉండాలి
దేశంమీద
'రేజరు' తీసేయ్యగానే
చీకట్లు
పొడుచుకొస్తుంటాయ్

వెలుతుర్లో స్నానం చేసి మనిషి
సూర్యమార్గంలోకొచ్చి నిలబడాలి
నా దేశమూ నా మనిషీ
గుడ్‌మార్నింగ్ చెప్పుకోవాలి.

*(ఆంధ్రజ్యోతి, 30-12-84)*



# గుండె కాయను పీకేసుకొని...

పెద్ద ఇబ్బందేమీ లేదు
కాకపోతే
మనిషి మనిషిగా బతకలేకపోతున్నాడు

పెద్ద ఇబ్బందేమీ లేదు
కాకపోతే
మనిషి విలువ పాతాళానికి పడిపోతుంటే
మసి విలువ ఆకాశా న్నంటుతోంది

పెద్ద ఇబ్బందేమీ లేదు
కాకపోతే
తలకాయలు లేనివాళ్ళు
కిరీటాల కోసం ఎగబడుతున్నారు
తలకాయలు ఉన్నవాళ్ళు
తమ తలల సంగతే మరచిపోయారు

పెద్ద ఇబ్బందేమీ లేదు
కాకపోతే
మల్లెల జల్లులు కురవాల్సిన ప్రజాస్వామ్యకాలంలో
మండే నెత్తుటి ఎండలు జనాన్ని కరుస్తున్నాయి

ఈరోజు పూవులెంత దయనీయంగా అడుగుతున్నాయో తెలుసా
మురికి మెడల్లో వేసి మమ్మల్ని అపవిత్రం చెయ్యొద్దని !
రాళ్ళురప్పలు ఎంత మొండిగా కోరుకుంటున్నాయో తెలుసా
చిల్లర తగాదాలకు మమ్మల్ని పావులుగా మార్చొద్దని!

కిరసనాయిలు, పెట్రోలు ఎంత ఆవేశంగా ప్రశ్నిస్తున్నాయో తెలుసా
పదహారణాల బంగారపు ఆడతనంమీద
బంగారం కోసం మమ్మల్ని మంటలుగా మార్చొద్దని !
సోడాలు, సీసాబుడ్లు ఎంత గొంతు పగిలేలా ప్రాధేయపడుతున్నాయో
తెలుసా
పచ్చిపగల కచ్చేలలో మా బతుకుపూలు మసి చేయొద్దని !

పెద్ద ఇబ్బందేమీ లేదు
కాకపోతే
మానవత్వం లేకుండా
ఎదగాలనుకుంటున్నాడు మనిషి...
గుండెకాయను పీకేసుకొని
దాంతో బంతాట ఆడుకోవాలనుకుంటున్నాడు మనిషి...

పెద్ద ఇబ్బందేమీ లేదు
కాకపోతే
ఈ పూలు, ఈ రాళ్ళు, ఈ కిరసనాయిలు, ఈ సోడాబుడ్లు
అమానుషాలకు తాము ఆసరా కాకూడదని
ఏకగ్రీవంగా తీర్మానించుకుంటున్నాయి
ఇన్నాళ్ళు విషాన్ని మోస్తూ వచ్చిన పాత్రలు
ఇప్పుడిప్పుడే తిరగబడుతున్నాయి

*(ఆకాశవాణి, విజయవాడ)*



# చలి

చలి
చలికి మరో పేరు పులి
పులి కాదంటే కలి
కలి కూడా కాదంటే ఆకలి

చలి పులికి ఉలికి
తలుపులు మూసుకుంటున్న
పీడితులం మనం...
చలి కలికి వెరచి
చేతులు కట్టుకుంటున్న
బానిసలం మనం...
చలి ఆకలికి కాలి
మట్టిలో కలిసిపోతున్న
శ్రామికులం మనం...

చేతులు ముడుచుక్కూర్చుంటే
చలికి బలం పెరుగుతుంది
చేతులు కలిపి కదులుతుంటే
చలికి గుండె వణుకుతుంది

బిగించే పిడికిలి
చలికి తగిలించే ఉరి,
ధైర్యంగా తలెత్తుకునే కళ్ళు
చలిని బలితీసుకునే నెగళ్లు

ఆశయాల్ని ఆలోచనల్ని
ఆచరణలో రగిల్చి
భవిష్యత్తు కాగడా వెలిగిద్దాం
కళ్ళు తిరిగిన పులి
దిగంతాలకు పరిగెత్తుతుంది

ఆత్మవిశ్వాసాన్ని మన గుండెలమీద పదునుపెట్టుకుని
ఆయుధంగా మారుద్దాం
మత్తు దిగిన కలి
మన పాదాలకు మొక్కుతుంది

మొగమోటం భయాల్ని ఛేదించుకొని
సమైక్య ప్రభంజన ప్రవాహమై పరాక్రమిద్దాం
మాటల సైనికులకు క్రమశిక్షణ నేర్పి
నోళ్ళు కొట్టే పొట్టల దుర్గాలు భేదిద్దాం
పిరికి నియంత ఆకలి
పలాయనమంత్రం పఠిస్తుంది

మన నరాలలో
ఎన్నో కాంతి హయాలు
మన కరాలలో
అగణిత సూర్యోదయాలు
మట్టిలోని వేళ్ళు
చెట్టుకి పోస్తాయి ప్రాణాలు
పనిచేసే మన వ్రేళ్ళు
చలికి వేస్తాయి సంకెళ్ళు.

*(ఆంధ్రజ్యోతి,*
*దీపావళి ప్రత్యేక సంచిక)*



# తూలుతున్న చీకటి

పువ్వుమీదికి పాకుతున్న
పురుగులా
అందమైన ఈ సాయంత్రంపై
ఆ చీకటి దండయాత్ర

పూలమనసు చెట్టును
రాతిగుండె గుట్టను
విషపు తలపు పుట్టను
ఒకేసారి కావిలించుకుంటుంది
చీకటి

నిండుమనసు పరిచే భూమిని
పగటి పడవ మీద కదిలే వూళ్ళను
చైతన్యం పరుగులుతీసే నదుల్ని
దిశలను ఏలే దేశాల్ని
కడుపులోకి లాగేసుకుంటుంది
చీకటి

ఈ చీకటి కుట్రకు
తలెత్తుకొని బతుకుతున్న చెట్లు
ప్రజలకు కనిపించవు,
గుండె తూట్లు పడిన
సంస్కృతి కోటబురుజు నిశ్శబ్దపు దిగుళ్ళు
ప్రజలకు వినిపించవు

ఈ చీకటి ముల్లు
అమాయకత్వం పాదాలలో గుచ్చుకొని
మానవత రుధిరాన్ని పీలుస్తోంది
ఈ చీకటి వూరకుక్క
సమతాభావాల పసిపిల్లల్ని కరుస్తూ
మనుషులు లేని రోడ్డుమీద
మంచుస్వరంతో అరుస్తోంది

నల్ల తుపాకీ చేతపట్టుకొని
కాంతిని కాల్చాలనే కోపంతో
ఒళ్ళంతా వూగిపోయేది చీకటి
ఓపికతోపాటు తుపాకీగుండ్లూ అయిపోయి
నవోదయ మహావృక్షం పాదాల చెంత
చేతులు తెగి పడిపోయేది చీకటి.

*(ఆకాశవాణి, విజయవాడ)*



# నిద్రపోతున్న ప్రభంజనం

కుక్కవెంట మనిషి చేతులుకట్టుకు నిలుచున్నాడు
కుక్కమెడలో డబ్బు సంచి వేలాడుతోందని...
ఎలుకను చూచి ఏనుగు వంగి వంగి దణ్ణంపెడుతోంది
ఎలుక కుర్చీమిద కులుకుతోందని...

గుండెలు బండలుగా మార్చుకొన్న కొండలు
కొత్తగా మొలిపించుకున్న రెక్కలు - ఈ డబ్బూ అధికారం
ఏ పేటకైనా ఎగిరెళ్ళగలవు ఆ పదవులు
ఏ తోటకైనా చేయగలవు మానని గాయాలు

ఇంకా మీసం కూడా మొలవని
ఓ బక్కచిక్కిన గోగుపుల్ల
కర్రపట్టుకుని వీధిలో నిలబడితే
గజం గజం పొడుగున్న వందలాది మీసాలు
ఇళ్ళలోకి దూరి బిగించుకుంటున్నాయి తలుపులు
ఇది చూస్తే కనిపిస్తున్న దృశ్యం

దేశం పూలచెట్టు తల్లివేరును
తినేస్తున్నాయి దర్జాగా
తెల్లచొక్కాలు తొడిగిన వేరుపురుగులు
ఇది చూస్తే కనిపించని దృశ్యం

ఎవరో విసురుతున్న ఎముకల ముక్కలకు
ఎగబడి పోతున్న ఏనుగుల్లారా !
ఆ ఎముకల ముక్కలు మన ఆకలి తీర్చటానికి కాదు
మనల్ని నిద్రలో ముంచటానికి పంచుతున్న మత్తుబిళ్ళలు...
వాళ్ళు మన పొట్టల్ని తడిమేది ప్రేమతో కాదు
మన డొక్కల్లో నేరాలు దాచిపెట్టి పోటానికి ఆడుతున్న నాటకాలు...

ఈరోజు ఒక్క పులి
వందలాది లేళ్లను తరిమితరిమి చంపుతోంది
ఈ రోజు ఒక గుంటనక్క
వేలాది కుందేళ్ళ గొంతులు తడిగుడ్డతో కోస్తోంది
ఈ రోజు విభజించి పాలిద్దామనుకున్న ఒక సింహం
అనేకానేక వృషభాలను ఆనందంగా ఆరగిస్తోంది

లక్షలాది బలవంతులైన అమాయకుల మీద
ఒక బలహీనుడు ఎక్కితొక్కటం ఈనాటి ఘనత !
తన బలం తనకే తెలియని
హనుమంతుడిలాంటిదీ జనత !

పనికిరాని మిణుగురులకోసం
మనలో మనం చెండాడుకోవటం ఘోరం
మన చేతులన్నీ కలిపి ధ్వజమెత్తితే
అదే దేశమాతకు కొత్త సూర్యహారం

*(విశాలాంధ్ర, 5-3-95)*



# ఈ వంతెన ఎవరిది ?

ఈ వంతెన ఎవరిది?
రోడ్డుదా!
పంట కాల్వదా!

నాలుగు పాదాలతో
ధర్మం బస్సు నడిచే రోడ్డుకు
నా నమస్కారం,
పొలాల శరీరాల్లోకి
నిర్మల రక్తాన్నెక్కించే
ధమనిలాంటి పంటకాల్వకు
నా వందనం

అటు కాసేపు మెక్కుతూ
ఇటు కాసేపు బొక్కుతూ
కులికే గోడమీది పిల్లికాదు
ఈ వంతెన

రెండు మంచి మార్గాల
లక్ష్యాలను స్పష్టీకరించే
నైపుణ్య సూర్యకిరణం
ఈ వంతెన

ఈ వంతెన ఎవరిది?
రోడ్డుదా!
పంట కాల్వదా!

చీకటి వ్యాపారాల్ని పొట్టలో పెట్టుకుని
రాకాసిపోకడలు పోయే లారీలకు
నడుంవంచి. నమస్కరించే
అజ్ఞాని కాదు ఈ వంతెన,

లక్ష్యం పండు అందుకోవాలని
నియమాల శాఖలపై సాగేవారిపైన
ఎగతాళిరాళ్ళు విసురుతూ
విశృంఖలంగా దూసుకుపోయే
మత్తిల్లిన మదాంధులకేసి
గురిపెట్టిన వీరుడి ధనుస్సు
ఈ వంతెన

రాత్రి చీకటి నిప్పుకు కాలి
బుగ్గయిపోతుంది ఈ వంతెన,
పగటి అమృత సూర్యకిరణాలతో
పునరుజ్జీవిస్తుంది ఈ వంతెన

ఈ వంతెన ఎవరిది?
రోడ్డుదా!
పంట కాల్వదా!

తన నెత్తికెక్కిన కాకి గుంపు
కాకిగోల చేస్తున్నా
మౌన దరహాసాలు చేసే
శాంత మహర్షిని చూస్తున్నా
ఈ వంతెనలో....

ప్రపంచాన్ని ముంచెత్తిన
మంచు సముద్రంలో నేర్పుగా
తేలియాడే గజీతగాడు
ఉన్నాడీ వంతెనలో

ఈ వంతెన ఎవరిది ?
మారుతీకారులో పోయే
తెల్ల జండాలదా!

రిక్షాలకు బరువెక్కిన
ఎర్ర జండాలదా!
చేతులు వదిలిపెట్టి తొక్కుతున్న
సైకిలు మీది పచ్చ జండాలదా!
ఎవరిది ఈ వంతెన!

ఈ వంతెనకు జండా లవసరం లేదు
రంగులు అసలే వద్దు
పిడుగులు పడినా తుఫానులైనా
సుస్థిర హృదయం దీనికి ప్రాణం

జేబులో రంగులేసుకొచ్చి
పనీపాటా లేనివాళ్ళు
వంతెన ముఖంమీద రంగులు పూసి
ఎగతాళి చేసి పోతుంటారు
అయినా సరే...
వంతెన ముఖంమీద చిరునవ్వు చెరగదు
ఆశయం ఒక్క అంగుళం కూడా బెసకదు

రంగుల చొక్కాలవాళ్ళు
రంగుల నినాదాల్ని ఎరువు తెచ్చుకొని
బలవంతంగా పూశారు నిన్నటిదాకా
ఈ వంతెన గుండెమీద...
ఈనాడు తానే రచించుకొంటున్నది
కొత్తగా కళ్ళు తెరిచిన తన గుండెలో

రంగులు మార్చే ఊసరవెల్లుల
భరతం పట్టే వాక్యాలు, నవభారత వాక్యాలు

కదులుతున్నట్టు కనిపిస్తూ
కదలలేని గుండెకన్న
కదలనట్టు కనిపిస్తూ
కదులుతూ, నిన్ను నన్ను కదిలిస్తూ
రోడ్డును పంటకాల్వను అదిలిస్తూ
బతికే ఈ వంతెన మిన్న

ఈ వంతెన ఎవరిది!
ముందు చూపుతో సాగే
రోడ్డుది, పంట కాల్వది
వెచ్చదనం పచ్చదనం కోరే
నీది నాది మనందరిది.

ఇంతకూ ఈ వంతెన ఏమిటి?
నిన్నూ నన్నూ
మనల్నందరినీ కలిపి నడిపించే
ఉక్కులాంటి నమ్మకం.

సమ సమాజ గమనంలో
నడుంకట్టి సహకరించే
ప్రతి భావన ఒక వంతెన
ప్రతిభా నరుడొక వంతెన.

*(ఆంధ్రజ్యోతి, 13-4-86)*



# జీవలక్షణం

ఒరే, సుఖాలన్నీ అనుభవిస్తూ
కష్టాలు తప్పలేదనే వాడా!
గాలుల సుడిగుండాలకు చిక్కినా
పచ్చగానే నవ్వుతూ వుంటుంది చెట్టని
గొడ్డళ్ళ గూండాలు గాయపరుస్తున్నా
కొత్త చిగుళ్ళ ఆయుధాలతో తలెత్తుకొని ఎదిరించేది చెట్టని
తెలుసా నీకు?

ఒరే, చెట్టు గర్భస్థ పిండాల్ని
ముక్కలుగా కోసుకొని తినేవాడా!
నీ కోసం జీవితాంతం
కడుపు పండించుకుంటూనే వుంటుంది చెట్టని
తన ఆహారాన్ని తానే
తయారు చేసుకొంటుంది చెట్టని
తెలుసా నీకు?

ఒరే, చెట్టుకు చలనం లేదని వాగే
పెరుగుదల ఆగిపోయిన వాడా!
పండ్లలో పూవుల్లో
కూరల్లో ధాన్యాల్లో
గింజల్లో పప్పుల్లో
చెట్టుకెంత చలనం వుందో
తెలుసా నీకు?
చలనం లేనట్లు కనిపించే భూమి
ఎంత వేగంతో తిరుగుతుందో
తెలుసా నీకు?

సరసరా పొలం దున్నుతున్న నాగలిలో
చెట్టు చలనం చూడు!
చీకటిని చీల్చుకొని సాగే దీపం వత్తిలో
చెట్టు సంచలనం చూడు!!
చెట్టు విశ్వమంతా తిరిగే జాడ చూడాలంటే
చెట్టంత మనసు పెంచుకో ముందు!!!

కదులుతున్న చెట్టు కదలనట్లుగా
ఎందుకు నిలబడివుందో తెలుసా నీకు?
మతిమరుపు పెరిగిన నీవు
చెట్టు ఎటు వెళ్ళిందో మరిచిపోయి
ఆకలితో అలమటించి ఛస్తావని
అమ్మలా నిన్ను ఆదుకుంటోంది చెట్టు,
వద్దని గెంటుతున్నా వెళ్ళని
విశ్వాసం ఉన్న కుక్కలా
నీయింటి ముందే నిలుచుంటుంది చెట్టు
నీ ప్రాణాల్ని నిరంతరం కాపలా కాస్తోంది చెట్టు,
నీకు ఇల్లు కట్టిపెడుతోంది చెట్టు
నీకు బట్ట చుట్టబెడుతోంది చెట్టు
నీకు దీపమై దారి చూపిస్తోంది చెట్టు
నీకు కుర్చీయై అందలాన్ని ఎక్కిస్తోంది చెట్టు...

ఒరే, చైతన్య హీనుడా!
నా దృష్టిలో
చెట్టు.... సజీవి
నీవు.... నిర్జీవి.

*(ఆంధ్రజ్యోతి, 27-7-86)*



## ఇంకోడికన్నా ముందే...

తల్లి గర్భాన్ని చీల్చయినా సరే
ఇంకోడికన్నా ముందు
ఈ గడ్డమీద వూడిపడాలి

అండపిండ బ్రహ్మాండంగా
ఆడుకుంటున్న పిల్లాడు
తింటూ విసురుతున్న ఇడ్లీముక్క
క్షణాల్ని ఒడుపుగా పట్టే ఏదో ఒక కాకిదే
క్షణానికి వెనకబడ్డ సవాలక్ష కాకులది కాదు

'కరెంటు' పోయేలోగా
కంప్యూటర్ల కెక్కినవే
నిఖార్సయిన వార్తలు

బస్సు రద్దీగా ఉన్నప్పుడు
'విండో'ల గుండా పరుగెత్తే 'కర్చీఫ్'లే
సీట్ల సింహాసనాలకు రాజులు

ఎంట్రన్సుల కురుక్షేత్రంలో గెలవాలంటే
ఇంకోడికన్నా ముందు
కొత్త శాస్త్రాస్త్రాలు కూర్చుకోవాలి
వాడెవడో పందు అందుకోబోతుండగానే
నీ బాణం వాడిగుండెల్లోంచి దిగి రావాలి

తప్పిపోయిన అడవి దారిలో
చీకట్ల ఏనుగుల గుంపు
ముసురుకోక ముందే
బయటపడినవాడు బతుకుతాడు
చేతకానివాడు పులులవాతబడిపోతాడు

అదిగో ఉద్ధృతంగా మహోద్ధృతంగా
పొంగి పరవళ్ళు తొక్కుతూ వస్తోంది వాగు
గెలిచిన 'గూండా' నాయకుడి ఊరేగింపులా
అంతకన్న వేగంగా అవతలికి చేరేవాడే
ఆ వైపు నిధి నిక్షేపాల్ని
అందుకోగలుగుతున్నాడు

తల్లి గర్భాన్ని చీల్చయినా సరే
ఇంకోడికన్నా ముందు
ఈ గడ్డమీద వూడిపడాలి
నడవటానికి నీకు నాలుగడుగులు
నేల కావాలంటే;

భార్యాపుత్రుల బంధాల్ని తెంచుకొనైనా సరే
ఇంకోడికన్నా ముందే
ఈ మట్టిలోకి దూసుకుపోవాలి
చివరకు పూడ్చటానికి
ఆరడుగుల 'జాగా' దొరకాలంటే.

*(ఆంధ్రజ్యోతి, 13-5-96)*



# గుర్రాలను మోస్తున్న మనుషులు

ఈ రోజు మనిషి రోడ్డుమీద నడిచి పోతున్నా
ఏదో రూపాయలకట్ట దొరుకుతుందనే
ఇవాళ మనిషి గునపంతో నేలను తవ్వినా
ఏదో లంకెల బిందెల సంపద చిక్కుతుందనే
ఇపుడు మనిషి ఆకాశంలోకి రాకెట్టులో వెళ్ళినా
రూపాయలు కాసే ఏ కల్పతరువో అందుతుందనే
ఆకాశంలో మబ్బులు కమ్ముకొని వస్తే
రూపాయల జల్లు లేవైనా కురుస్తాయని
అరుగో ఎదురు చూస్తున్నారు
రెండు కళ్ళనే వెయ్యి కళ్ళుగా మార్చుకొన్న మానవులు...

మనిషి మెదడు గురించి
ఇంకా ఇంకా పరిశోధన చేస్తున్న శాస్త్రజ్ఞుల్లారా!
మీ అమాయకత్వం తప్ప అక్కడ ఏముంటాయి
ఏ పొరవిప్పినా ఊడిపడే రూపాయిల నోట్లు తప్ప!

ఊళ్ళో
హత్యలు మానభంగాలు జరుగుతున్నా
అంతా నిద్రపోతున్నారు
మేలుకొలపడం నావల్ల కావడం లేదు
ఇంతలో ఓ రూపాయి బిళ్ళ
జారికిందపడేసరికి
జనం లేచి ఒకటే పరుగులు... ...

మురికి నగరమైనా
విద్యుద్దీపాల కాంతితో వెలిగిపోతున్నట్లు
ప్లాస్టిక్ బొమ్మలు కూడా
పచ్చనోట్ల వెలుతురు పడితే చాలు
అవే సౌగంధిక పుష్పాలు
తుమ్మెద వరుడికి
మధువు లేకపోయినా సరే
పరిమళాలు పట్టుబడకపోయినా సరే...

డబ్బు చెట్లనూడ్చి
కోసుకొచ్చుకొన్న రూపాయల కొమ్మలతో
చక్కగా కాపురం చేయాల్సిన వాళ్ళు
ఇంకా పండ్లు కావాలని చెట్లను వేధిస్తున్నారు,
గుడ్లనీరు కుక్కుకుంటున్నాయి కాపులేని చెట్లు
ఉరితాటికి చిక్కుకుంటున్నాయి దిక్కులేని కొమ్మలు

మమతను సమతను ఖాళీ చేయించి
ఎక్కువ లాభముంటుందని
షేర్ మార్కెట్‌కు "గుండె" గదిని అద్దెకు ఇస్తే
ఇపుడది గదిని ఖాళీ చేయను పొమ్మంటోంది
ఓనరు "మనిషి"నే బయటకు గెంటుతోంది

సమాజం త్రాసులో
ఒక పళ్ళెంలో సరస్వతిని
మరో పళ్ళెంలో నోట్ల కట్టలు పెడితే
రూపాయల బరువే ఎక్కువని తేలిపోయింది
సరస్వతిని నమ్ముకొన్న అమాయకత్వం
దీనంగా రోడ్డుమీద పడిపోయింది
సరస్వతి మెడకు తాడుగట్టి
పబ్లిగ్గా ఈడ్చుకుపోతున్నాయి నోట్ల కట్టలు...

అదిగో, నిన్నటిదాకా మన కాళ్ళ చెంత
ఎన్నాళ్ళనుంచో పడివున్నది ఆ కొండ
ఇపుడా కొండకు కాలం
డబ్బుతో పోసింది ప్రాణం...
ఈ దెబ్బతో ఏనుగులా లేచిన కొండ
ఊళ్ళమీదపడి దూకటం మొదలుపెట్టింది
విద్యాలయాలను తొక్కుతోంది
దేవాలయాలను గుద్దుతోంది
మనిషికి మూడో కన్ను ప్రసాదించే
గ్రంథాలయాలను కుమ్ముతోంది

డబ్బు గుర్రాన్ని ఎక్కి
విజయవిహారం చేయాల్సిన మానవుడా!
గుర్రాన్ని నీవే నెత్తికెక్కించుకొని
ఆనందంగా మోస్తున్నావా!
ఇపుడు కాకపోతే రేపటికైనా
ఆ గుర్రం తన్నక మానదు
నీ తల పగలక తప్పదు

*(ఆంధ్రజ్యోతి వారపత్రిక 23-2-96)*



# "నాన్నకు చెబుతావుండు !"

వేలెడు లేడు వెధవ !
అల్లరిచేస్తే కొట్టానని
"నాన్నకు చెబుతావుండు!" అంటాడు వాడు !

పాలు తాపి
భాష నేర్పి
నా ప్రాణాల్ని వాడికోసం
పువ్వులుగా పరిచి నడిపిస్తుంటే
"నాన్నకు చెబుతావుండు!" అంటాడు వాడు !!

అనకేంచేస్తాడు వాడు !
వాళ్ళ నాన్న
ఇంట్లో వుండేది కాసేపే అయినా
నన్నో పనిమనిషిలా చూస్తుంటే !!!

*(విశాలాంధ్ర, 26-6-85)*



# షేర్ మైండ్

ఏదో తినొచ్చని
షేర్ బజారులో
తిరుగుతుంటుంది
వూరకుక్కలా

ఏదో పెడుతుందని
"స్పెక్యులేటివ్ స్ట్రిప్" కోసం
కాపలా కాస్తుంటుంది
ఇంటికుక్కలా

కుంటుతూవున్న ఒంటి అంకె "షేరు"
రెండంకెలుగా పెద్ద పెద్ద అంగలు వేస్తూ పరుగందుకొని
మూడంకెలుగా దూసుకుపోతున్నప్పుడు
చివరకు పట్టుకోగలుగుతుంధి
రేచుకుక్కలా

రాకెట్‌లా
నాలుగంకెలకు వెళుతుందనుకున్న "షేరు"
"ఒరిజినల్" ఒంటి అంకె శూలంగా మారి
నిట్టనిలువునా నెత్తిమీద కూలేసరికి
వీధులంటబడి తిరుగుతుంటుంది
పిచ్చికుక్కలా

*(విశాలాంధ్ర 20-3-94)*

# అమరత్వం

కాగితం జైల్లో
చిక్కుకున్న సౌందర్యాల్ని
విడుదల చేస్తాడు చిత్రకారుడు

మూగ రాతి పలకలలో
తలుపులు మూసుకొన్న చైతన్యాల్ని
బయటకు లాగుతాడు శిల్పి

శబ్దాల పువ్వులలో
అట్టడుగున స్రవించే మాధుర్యాల్ని
ప్రసారం చేస్తాడు గాయకుడు

శరీర విశ్వంలో
అంతర్లీనమైవున్న కాంతి విన్యాసాల్ని
ప్రదర్శించి వెలిగిస్తాడు నటుడు

భాషా మందిరంలో
మత్తుగా నిద్రిస్తున్న నిప్పు రవ్వల్ని
సూర్యబింబాలుగా మేల్కొలుపుతాడు కవి....

స్తబ్ధత విషం తాగి
చావబోతున్న నా ప్రజలకు
అమృతం పోస్తాయి కళలు.

*(భారతి, డిసెంబరు 1983)*

# "సు"దర్శనం

ఒకణ్ని చూస్తే
లేడిని తినాలనుకుంటున్న
పెద్దపులి గుర్తొస్తుంది...

ఇంకొకణ్ని చూస్తే
గోతికాడ కాచుక్కూర్చున్న
గుంటనక్క గుర్తొస్తుంది...

మరొకడ్ని చూస్తే
బల్లకింద గడ్డితింటున్న
జంతువొకటి గుర్తొస్తుంది...

కలం పట్టుకున్న
నిన్ను చూస్తే మాత్రం
మన ఊరివాళ్లకు
సూటిగా విల్లెక్కుపెట్టిన
సూర్యవీరుడు గుర్తొస్తాడు.

*(విశాలాంధ్ర 19-4-87)*



# విశ్వరూపం

అవును ప్రస్తుతం మేం
మీ కాళ్ళకింద నలుగుతున్న చలిచీమలమే
రేపు ధనగర్వ సర్పాన్ని పట్టి పల్లార్చే
సామూహిక శక్తి మేమే

అవును ప్రస్తుతం మేం
అక్కడక్కడా పడివున్న గడ్డిపోచలమే
రేపు అధికార మత్తగజం పెడరెక్కలు విరిచికట్టే
వెంటిమి మేమే

అవును ప్రస్తుతం మేం
చెల్లాచెదురుగా వున్న చిన్నచిన్న నక్షత్రాలమే,
రేపు చీకటి వ్యవస్థను సమూలంగా పెళ్ళగించే
సమైక్య సూర్యబింబం మేమే

ఇపుడీ వడగాడ్పులలో మా ఆలోచనల బీజాలు
గాలిలో కొట్టుకుపోతున్న మాట నిజమే
అనుకూల వర్షాలు రానీ !
భూమిలో ఎక్కడ చూచినా మా మొలకల ములుకులే !

*(విశాలాంధ్ర 1-5-87)*



# ఎండలు మన చుట్టాలు

ఎండలు మన చుట్టాలు
ప్రకృతిలో చదివే ప్రజలకు
పచ్చని భవిష్యత్తు అనే ఉద్యోగం ప్రసాదించే పట్టాలు

వృక్షాల వేదికల పైకి
ఆకుల ద్వారాల గుండా ప్రవహించి
కొత్త చిగురులుగా పువ్వులుగా
కాయలుగా విత్తనాలుగా...
బహు పాత్రాభినయనం చేస్తున్నాయి ఈ ఎండలు

చర్మవ్యాధు లల్లుకున్న కాలవలకు పూసే
తాజా "ఆయింటుమెంటు" ఈ ఎండలు
చీకటి కంపును చెదరగొట్టటానికి
ధూసుకొస్తున్న సూర్యపుష్ప పరిమళాలు ఈ ఎండలు

తొలకరిజల్లుల కాన్వెంటుపిల్లల్ని మోసుకురాటానికి
పరుగెత్తుకొస్తున్న రిక్షా బండ్లు
కొత్త పైరులు పెరగటానికి
పునాది ఎరువుల ప్రాణాలు

పగలే కాదు
రాత్రి కూడా
ఈ ఎండలు ఉంటాయి
తారల్లో, వివిధ అవతారాల్లో...

ముంచుకొచ్చే రాత్రి వరదలో ప్రపంచం
మునిగిపోకుండా ఉదయం రేవు చేరటానికి
చంద్రుడనే పడవను పంపిస్తాయి
కన్న బిడ్డలు ప్రజల కోసం ఈ ఎండలు

"స్విచ్చి" నొక్కగానే వెలిగే విద్యుద్దీపం
అప్పుడే కళ్ళు తెరిచిన సూర్యుడి సూక్ష్మ రూపం
చేతులతో వత్తి చేసి వెలిగించిన దీపం
చెమట బిందువుల బంధువులైన ఎండల ప్రతిరూపం

పసిపిల్లల నోళ్ళలోకి
పాలుగా మారి వస్తుంటాయి
ముసలాళ్ళ ఒంట్లో నుండి
పాలిపోయి పోతుంటాయి

మిత్రులార ! మనలో మెరిసే కండలు
రకరకాల రంగుల్లో వెలిగే ఎండలు
పాత నీరు పోతూ కొత్త నీరు వస్తుంటేనే
నది బతికున్నట్లు లెక్క,
పాత కండల్ని కరిగిస్తూ కొత్త ఎండల్లో స్నానిస్తుంటేనే
మనిషి జీవిస్తున్నట్లు గుర్తు

ఈ ఎండల్లో దేశం
అసలు బాధపడటం లేదని కాదు
నవ వర్షర్తు శిశూదయ సందర్భంలో
ఆ మాత్రం ప్రసవ వేదన తప్పదు.

*(కోస్తావాణి, 5-6-1988)*

# మేధావికి బహిరంగలేఖ

కుక్కన్నా
కుక్కలాంటి మనిషన్నా
నా కసహ్యం

వాడు నీకు
కమ్మని మాంసంముక్కలు పెడుతున్నాడని
పన్నీటి స్నానం చేయిస్తున్నాడని
పట్టుపరుపుపై పడుకోబెడుతున్నాడని
విశ్వాసంగా పడివుంటావా !

నీకీ సౌకర్యాలు సమకూర్చేది
వాడుకాదు
మేమే అసలు కర్తలం
సహస్ర కరులం

వాడు
మా నెత్తురు పీల్చి
విలాసంగా మార్చి
అంతస్తులమీది అంతస్తుల్లో
చీకటిలో దాస్తున్నాడు
నిన్ను
కాపలాగా ఉంచుతున్నాడు

దొంగన్నా
దొంగసొమ్మన్నా
దొంగసొమ్ము తినేవాళ్ళన్నా
నా కసహ్యం

లే!
సింహం నీవై విజృంభించు !
దొంగల గుండెల్ని చీల్చు !
నీ తిండిని సృష్టించిన
మూలపురుషుల్ని ఉద్ధరించు !!

కుక్కన్నా
కుక్కలాంటి మనిషన్నా
నా కసహ్యం

వేటకుక్కలన్నా
వేటకుక్కల్లాంటి వీరులన్నా
నాకెంతో యిష్టం

*(యువకవిత, జనవరి-మార్చి 1985)*

# పాలకుండ

కొందరి మనసులు
మంచికే నిలయాలు
వాళ్ళు దేవతలు

కొందరి మనసులు
చెడుకే స్థావరాలు
వాళ్ళు రాక్షసులు

మానవుడి మది
రెండు అరల గది
మంచి ఒకటి
చెడు మరొకటి

పాలకుండ కదిలి
ఎంతైనా జారి
విషం కుండలో కలిస్తే
విషంలో మార్పుండదు

విషం కుండ తొణికి
ఒక బిందువు రాలి
పాలకుండలో పడితే
పాలంతా విషం! విషం!!

నీ మనసులో-
పాలనెప్పుడూ
పైనే ఉంచు !
విషాన్నిప్పుడే
కిందకు దించు !



# క్రాంతి గోళం

నా కళ్ళల్లోంచి
ఎండలు కాస్తున్నాయి
బురదను ఎండగట్టడానికి

నా మనసులోంచి
చిరుగాలులు వీస్తున్నాయి
కంపును తొలగించడానికి

నా నెత్తురులోంచి
వానజల్లులు కురుస్తున్నాయి
సమతను విత్తడానికి

నా చేతుల్లోంచి
పచ్చని పంటలు పండుతున్నాయి
జగతిని బతికించడానికి

ఎలాగంటారా?
నా లోపల నిరంతరం తిరుగుతున్నాడు
అస్తమించని మహాభానుడు



# వాషింగ్ రూమ్

మబ్బులు
ఆకాశంలో విసిరేసిన
దేవతల బట్టలు

చంద్రుడు
మురికిబట్టల్లో పడి
ఆడుకునే పిల్లాడు

సూర్యుడు
మిరుమిట్లు గొలుపుతూ
మురికిని నరికే సబ్బుబిళ్ల

*(ఆంధ్రపత్రిక, మే-1980)*



# గుండె రాయి

పొలంగట్టు గుండె
ఎలా కొట్టుకుంటుందో తెలుసా!
కన్ననేలను
ముక్కలు ముక్కలుగా విడగొట్టుకుంటున్నానని

నిండని కుండ గుండె
ఎలా కొట్టుకుంటుందో తెలుసా!
ఒళ్ళంతా తలగా మార్చుకొని
వెలుతురు పూర్తిగా నింపుకొనే దెపుడని.

కుండీ గుండె
ఎలా కొట్టుకుంటోందో తెలుసా!
ఓ చిన్నారి మొక్కను
గుండెల్లో పెట్టి పెంచుకోవాలని.

తుపాకీ గుండు గుండె
ఎలా కొట్టుకుంటోందో తెలుసా!
ఎపుడు ఎవడి గుండెవ్యూబిలో
ఎలా దిగిపోవాల్సి వస్తుందోనని.

జండా'సీత' గుండె
ఎలా కొట్టుకుంటోందో తెలుసా!
ఎప్పుడు ఏ వేషంలోవచ్చి
ఏ రావణహస్తం తనను తాకుతుందోనని.

ప్రపంచానికంతా గుండె కొట్టుకుంటోంది
గుండెవున్న ఆ 'మనిషి'కి తప్ప.

*(విశాలాంధ్ర 8-9-1996)*



# నాలో మంటలు లోకం పంటలు

నాలో
లోలో
మంటలు మంటలు
తెల్లని మంటలు
దేశాలను దీవిస్తాయ్
సముద్రాల్ని శాసిస్తాయ్

నా మంటల్లో
నా మాటల్లో
ఒక నీతి
ఒక గీతి
ఒక రీతి
ఒక హేతి

నీలో
ఏవో
కాల్వలు కాల్వలు
మురికి కాల్వలు
కిరణాలకు భయపడతాయ్
మసిపోయాలని చూస్తాయ్

నీ కాల్వల్లో
నీ చీకట్లో
అవినీతి
స్వార్థబుద్ధి
దౌర్జన్యం
అన్యాయం

నా మంటలు ఆర్పే కిటుకు
నీకే తెలుసనుకుంటావ్ !
నీ కిటుకులు కూల్చే సంగతి
నాకు తెలియదనుకుంటావ్ !

దశదిశాంత పర్యంతం
నా మంటలు వ్యాపిస్తాయి
ఆ నవ తేజో లోకాలు
అవనిలోన దీపిస్తాయి

(భూ. తి, జనవరి, 1983)



# కాపలా కర్ర

నాకు తెలియ కడుగుతాను
రాదారి మీద పయనిస్తున్న నన్ను
ఈ వీధిసింహం
ఇలా వెంటబడి వేధిస్తుందెందుకు !?

దొడ్డిదారుల్లో
చీకటి బజారుల్లో
తిరుగుతున్న వాళ్ళమీదకు దూకటం మానేసి
రాదారిమీద పోతున్న నన్ను
ఇలా వెంటబడి అడ్డుకుంటుం దెందుకు !

ముందుకుపోతున్న చేతులతో కలవాలని
వెనుకబడిన కాళ్ళను కేకేస్తూ
దిక్సూచిని గుండెజేబులో పెట్టుకొని
భవిష్యత్తు లైటుపై దృష్టిని కేంద్రీకరిస్తూ
దూరాలను అడుగుల కిందేసి తొక్కుతూ
రాదారి మీద నడుస్తున్న నన్ను
ఇలా వెంటబడి సాగనీయదెందుకు !

ఇది దొంగల్ని పసిగట్టేది కాదు
దొంగలు పెట్టే ఎముక ముక్కలకు ఆశపడి
నోరంతా విల్లుగా మార్చుకొని
అరుపుల బాణాలు అదేపనిగా విసురుతూ
దొంగల స్థావరాలకు రక్షా కవచంగా మారిపోయింది
దోపిడీలు జరుగుతున్నప్పుడు ముచ్చులా కూర్చుంటుంది
మేల్కొన్న గూర్ఖాల గొంతుపట్టి పీకుతుంటుంది

అవును, నేను పయనిస్తున్న సమయం
రాతి గుండె రాత్రి అని తెలుసు
నా చుట్టూ దొంగల నీడలు
ముసురు కుంటున్నాయనీ తెలుసు

నా దారి పక్కనే
రోడ్డు తల్లి ఒడిలో నిద్రపోతున్న వాళ్ళు
రాదారినే ప్రేమించి
ముందు వెనకల్లో నడుస్తున్న వాళ్ళు
అలజడికి కళ్ళు తెరచి ధైర్యంగా వస్తారని
అందరం చేతులు కలిపి వాళ్ళ పని పడతామని
దొంగలు స్థావరాలు కోల్పోతారని
వీధిసింహాలతోపాటు పారిపోతారని
అదే నాకు నమ్మకం
కాపలావాడి చేతిలో కర్రలాగా

*(విశాలాంధ్ర, 3-11-94)*



# దివాంధం

చాలీచాలని తిండి పెట్టి
ఆ 'టార్చిలైటు' భద్రమని చెప్పి
ఇచ్చి పంపింది తెల్ల చొక్కా

'టార్చిలైటు' దాచుకొని బొడ్లో
పశువులపాక దగ్గర్లో
నిద్రపోతున్నది నల్ల చొక్కా

ఉదయం తూర్పునుంచి బాణాలు
కళ్ళల్లోకొచ్చి తగిలాయి కరకరా
సూర్యుడు టార్చిలైటు పెత్తుకుపోతాడేమోనని
పరుగెత్తింది నల్లచొక్కా బరబరా
చీకటి ముళ్ళ కొష్టంలోకి
కట్టేసిన పశువుల మందలోకి.

*(ఆంధ్రజ్యోతి, వారపత్రిక
6-4-1979)*



# చలి రాత్రి

బురదలో పడి గంతులేస్తున్న
ముసలిపంది రాజకీయంలా
ముదురుతున్నదీ చలిరాత్రి

కంపుదాచి ప్రకాశిస్తున్న
మేడిపండు సంస్కరణల్లా
మెరుస్తున్నదీ చలిరాత్రి

నిశ్శబ్దంగా భయంకర శాంతి సృష్టిస్తున్న
వాడిగోళ్ళ ప్రభుత్వ శాసనాల పులిలా
తిరుగుతున్నదీ చలిరాత్రి

వాతావరణానికి మారుతున్న
పాదరసం చలచిత్త ప్రచారాల్లా
పాకుతున్నదీ చలిరాత్రి....

చీకటి,
చుక్కలు,
ఈదురుగాలి,
పొగమేఘాలు....
సూర్యుడు రాగానే
అగ్నిలో మిడతలు.

(ఆంధ్రజ్యోతి, వారపత్రిక



# కవీ రైతూ దేశానికి రెండు కళ్ళు

నాకూ మానాన్నకూ తేడాలేదు
మానాన్న హలం పొలంమీద పెట్టి అక్షరాలు రాస్తున్నాడు
నేను కలం కాగితంమీదుంచి ధాన్యాన్ని పండిస్తున్నాను

మానాన్న నేలగుండెలు కూలుస్తున్నాడని
నేను కాగితం శీలాన్ని చెరుస్తున్నానని
ఆయుధాలతో మేమిద్దరం హింసను ప్రేరేపిస్తున్నామని
గిట్టనివాళ్ళు పొగపెడుతున్నారు
జాతి ప్రాణాలపై పగపడుతున్నారు.

నా కలంలోనుండి అక్షరాలు
ముందుకు దూసుకువస్తున్న సుశిక్షితులైన సైనికులు
హడలెత్తి పోతున్నారు
నావాళ్ళను పీడించే నల్ల గుండెల వాళ్ళు

నా కలంలోనుండి అక్షరాలు
ఆకలి చీకట్లను తొలగించే
వెలుతురు ధాన్యపు గింజలు
చేతులెత్తి పిలుస్తున్నాయి
నా గింజలకు విశ్వరూపశక్తి కలిగిస్తామని
ప్రజాహృదయ క్షేత్రాలు

కష్టమంతా పచ్చని అమృతంలా మార్చి
పొలాల నిండు గుండెల్లో భద్రంగా ఉంచి
విషంబొట్టు దొంగలు రాకుండా చూసే
కాపలావాడి వడిసెల  నా కలం

ఎన్ని శిశిరాలు వెన్నుపోటు పొడిచినా
ఎన్ని పండుటాకులు తనను వదిలిపోయినా
ఎన్ని గొడ్డళ్ళ గూండాలు గాయపరిచినా
ఆత్మవిశ్వాసంతో నూతనోత్సాహంతో
మళ్ళీ కొత్త చిగురులు తొడిగిన చెట్లు
నా కలానికి బంధువులు

నిద్రపోతున్న మొద్దుల్లాంటి
ఎద్దుల్ని మేలుకొలిపే
చెర్నకోల హెచ్చరికలు
నా కలానికి స్నేహితులు

ఎండిపోయిన మొక్కల ముఖాలు చూచి
హడావిడిగా పరిగెత్తుకొచ్చే
గలగలా మాట్లాడుతున్న పంటకాల్వలు
నా ఆలోచనలు

చిక్కిపోయిన నదీనదాలకు
కొత్త రక్తాన్ని ఎక్కించటానికి
దివి నుంచి భువికి దిగివచ్చే
వర్షపు జల్లులు నా ఆశయాలు

చిరునవ్వుల పువ్వుల
పత్తిచేనుమీద పడి
రక్తాన్ని పీల్చేస్తున్న దోమలగుంపుమీద
క్రిమిసంహారక మందులు చల్లడం నా ఆచరణ

మీరు పాములుగా మారి
నా దారి కడ్డువస్తుంటే
గోమాతలాంటి నా కలం
గరుత్మంతుడై పరికిస్తుంది.

నా కలం
పీడితునికి చిహ్నం
శ్రమజీవనానికి సంకేతం
సామాన్యుడికి ప్రతీక
ధర్మానికి పతాక

పాలిస్తున్న ఆవుల్నడిగి
దున్నిపెడుతున్న ఎద్దుల్నడిగి
పంటలు మోసే బండిని అడిగి
కన్నతల్లి నేలను అడిగి
ఓ కొత్త సిరా తెచ్చుకొంది నా కలం

ఎండిన డొక్కల్ని చేరుకుందామని
బయలు దేరిన పంటను
నిప్పుకళ్ళతో భయపెట్టి
దోచుకునే చీకటితో
నా కలం 'కుస్తీ' పోటీ...

ఈ చీకటిని తొలగించడమే
నాకూ మానాన్నకూ ఆరాటం
తరతరాలుగా మేం చేస్తున్నాం
ఈ చీకటితో పోరాటం

నాకూ మానాన్నకూ తేడాలేదు
మానాన్న హలం పొలంమీద పెట్టి
అక్షరాలు రాస్తున్నాడు
నేను కలం కాగితం మీదుంచి
ధాన్యాన్ని పండిస్తున్నాను

మానాన్న హలంతో, నేను కలంతో
తూర్పునుంచి బయలుదేరాము
మార్పుకోసం కలిసి సాగాము
మా మధ్య నడిచి వస్తున్నాడు
మా చిటికెన వేలు పట్టుకొని
దిక్కుల్ని పలకరిస్తూ
చిరునవ్వుతో కిరణభానుడు
ప్రపంచాన్ని పాలించే
రేపటి మా వారసుడు.

*(ఆకాశవాణి, విజయవాడ)*



# గుహ

వాడికాళ్ళమీద కొడతారా !
పోనీలే అని ఊరుకొంటాడు
మీవెంట తిరిగే కుక్కల నెత్తురు
ప్రవహిస్తోంది వాడి కాళ్ళల్లో !!

వాడి చేతులమీద కొడతారా !
ఏదోలే అని సర్దుకుంటాడు
పాలన్నీ మీకే ఇచ్చే గోవుల నెత్తురు
ప్రవహిస్తోంది వాడి చేతుల్లో !!

వాడి పొట్టమీద కొడతారా !
మీ అంతు చూడక వదలడు
వాడి కడుపులోనే ఉంది
నిద్రపోతూ బెబ్బులి.

*(ప్రజాశక్తి, 14-2-81)*



# 'చద్ది' సూర్యుడు

నిన్న దినపత్రికలు
కట్టి వదిలేసిన చీరలు
నేడు కట్టుకొని కులుకుతున్నాయి
రేడియో దూరదర్శన్‌లు

ప్రపంచమంతా ఉదయించిన సూర్యుడు
ఇంకా ఈ పెట్టెలోకి రాలేదు
బహుశా రేపు సాయంత్రానికి
మినుకు మినుకుమంటూ కన్పించవచ్చు
కత్తెరపడితే
ఉదయించకుండానే అస్తమించనూవచ్చు

వేడి వేడి సూర్యుడ్నించి
పూలు కోసుకొచ్చుకోటానికి
పడుచుదనం పోటీపడుతుంటే
ఈ అస్థిపంజరాలు
నీరుగారే పడమటి సూర్యుడ్ని చూపుతూ
"ఇప్పుడే అందిన వంటని" బుకాయిస్తున్నాయి.
ప్రపంచం భస్మీపటల మౌతుంటే
పరిస్థితి అదుపులో ఉందని
ఇవి మొరుగుతున్నాయి

కుర్చీలెక్కుతున్న దృశ్యాలు
బాగా కనిపిస్తాయి గాని
ఆ కుర్చీల్ని చేసిన చేతులు
వీటికి కనిపించవు

చద్దన్నం
వంటికి మంచిదయితే కావచ్చుగాని
చద్దిసూర్యుడు
ప్రపంచానికి పనికిరాడు.



# పాట

పాట ప్రసరిస్తున్న గాలిరా,
బాంబులేసి పేల్చగలవా !

పాట ప్రవహిస్తున్న నదిరా,
గొడ్డలితో నరకగలవా !

పాట ఉబికొస్తున్న బడబానలంరా,
కత్తులతో పొడవగలవా !

పాట ప్రజ్వరిల్లుతున్న ఆకాశంరా,
తుపాకులతో కాల్చగలవా !

పాట పరిభ్రమిస్తున్న భూమిరా,
లాఠీలతో చంపగలవా

పంచభూతాల భిక్షతో బతికే
ఓ పరాన్నజీవి బడుద్దాయీ !
పంచభూతాల గుండెకాయ
పాట నెలా హత్య చేస్తావురా !

*(గద్దర్‌పై జరిగిన హత్యాయత్నాన్ని నిరసిస్తూ)*



# నవ్వే మా పత్తి చేను

ఒళ్ళంతా కళ్ళు చేసుకొని
కళ్లనిండా చిరునవ్వులు నింపుకొని
చిరునవ్వుల్లో శాంతి బీజాలు పొదువుకొని
సాగే కాంతిదూతలా
పలకరిస్తోంది మన పత్తి చేను

వడగాలులు రాళ్ళు విసిరి గాయపరిచినా
పెనుతుపానులు చెంపదెబ్బకొట్టి కరిచినా
నిటారుగా నిలిచే వుంటుంది మన పత్తి చేను
నిర్వికార క్షమాహృదయం మన పత్తి చేను

బండబారిన మట్టిగుండెను మెత్తన చేసి
ముక్కుసూటిగా ముందుకు సాగిపోయే నాగలిమీద
ఇంకా పగబట్టి తిరుగుతున్న పాముల్ని చూస్తూ
సన్నగా నవ్వుకుంటోంది మన పత్తి చేను

మన పొలంలోకి విత్తులా చొచ్చి
మిత్తిలా బలుస్తున్న కలుపుమొక్కల్ని
వేళ్ళ కొడవళ్ళతో పీకుతున్న ఆడపడుచుల అవస్థలు చూచి
మౌనంగా రోదిస్తోంది మన పత్తి చేను

కాయలున్న చెట్టును చూస్తే
అసూయగా దూసుకువస్తాయి రాళ్ళు
నవ్వుతున్న మన పత్తిచేను బతుకుమీద
దౌర్జన్యం చేస్తున్నాయి చీడపురుగులు,
పురుగుల్నేరేస్తున్న చేతులకు
కృతజ్ఞతలు పలుకుతోంది మన పత్తి చేను
పురుగుమందు కొడుతున్న "ఇంజను" చేతలకు
తలవంచి నమస్కరిస్తోంది మన పత్తి చేను

పత్తిచేను నా తలపుల్లో మెదిలినపుడల్లా
నా మెడలో వేసినట్లుంటుంది వేలవేల చంద్రకిరణాల మాలలు
పత్తి చేను నవ్వుల్ని చూచినపుడల్లా
నాకు స్ఫురిస్తారు ఆకాశంలో ఆడుకునే అనేక చంద్రకిరణాల
బాలలు

కాళ్ళు లేకపోయినా
నీ ప్రమిదలోనికి చేరి
నీ చీకటి పాడుకొంప కూల్చి
నీకు వెలుతురు కోట కట్టిపెట్టేది పత్తి చేను,
చేతులు లేకపోయినా
నీవు పుట్టావని తెలిసి
నీ ఒంటిమీదికి చేరి నిన్నంతా నిమురుతూ
నీకు రక్షణ కవచం ఏర్పరిచేది పత్తి చేను...

ఇంతగా ప్రాణమిస్తున్న పత్తిచేను దేవతకు
మనం పెడుతున్న నైవేద్యం ఏమిటి?
చాలీచాలని ఎరువుల మెతుకులు!
తెగుళ్ళు తగ్గించలేని కల్తీ మందులు!

చీకటిలో వుంటూ
చీకటినే తింటూ
అందరికీ వెలుతురు పంచే
పత్తి చేను ఎవరో తెలుసా!
మనల్ని కన్న మన మాతృదేశం
మమతలతో సతమతమయ్యే మన భారతదేశం

పత్తి చేనును కాపాడాలి
పత్తి చేనును కాపాడే
కాపలావాళ్ళను కాపాడాలి.

*(విశాలాంధ్ర, 22-1-95)*

## 'పండు' పొలాలు

నిలబడి పాలుతాగడం నేర్చినవాడిని
పరమాన్నం దొరుకుతుందంటే పరుగులు తీసాను
కనీసం నీళ్లు కూడా అక్కడ దొరకలేదు
కొత్తబట్టలు తొడిగిన నా ఆశలు శవాలు కావడం తప్ప.

మంచును చీల్చే తొలికిరణంలాంటి హృదయం నాది
ప్రపంచాన్ని పసిపిల్లాడిలా ఒళ్ళోకి తీసుకొని పాలిచ్చే దయ నాది
తిండిపెట్టే చేయిని
మొండిచెయ్యి చేసుకున్నాను
పండు పొలాల గుండెలు
పండించుకోవడం మరచిపోయాను

అన్నం వండే కుండలో
షేర్‌మార్కెట్‌ను నాటుకొని నిన్న ఆరిపోయాను
పండ్లు పంచే నా తోటలో
రొయ్యల చెరువులు తవ్వుకొని నేడు జారిపోయాను
వ్యాపారం పురుగు కుడితే
మాయరోగం వస్తుందని ఇప్పుడిప్పుడే తెలుసుకున్నాను

నా తిండిపెట్టే చేయి ఇక మొండిచేయి కాదు
నా గుండె పండెవరూ చిదిమేయలేరు
ఇక నానుండి ప్రసరించే పరిమళాలు
ఈ నా మనుషులు శ్వాసించే పవనాలు



# ప్రాణ "మిత్రులు"

ప్రపంచమంతా సోదరులే-
అని తలచే
బాబూ ! నీకో నమస్కారం !

ప్రపంచమంటే పీడకులూ పీడితులే-
అని చెప్పే
తమ్ముడూ ! నిన్ను అభిమానిస్తున్నాం !

పీడితులంతా కలిసికట్టుగా
తిరుగుబాటు చేయాల్సిందే-
అని రాసే
అన్నయ్యా! నిన్ను ప్రేమిస్తున్నాం!

పేదలక్కోసం రంగంలో దిగి
చీకట్లో నెత్తురు కిరణాలు చిందించే
మిత్రులారా!
ఈ చీకట్లను కాలికిందేసి తొక్కుతాం
మా ప్రాణాలు మీ బాటలో విత్తుతాం

*(యువకవిత, జనవరి-మార్చి 1985)*

# మీరు చెప్పినట్లే

మీరు చెప్పినట్లే
లోకంలో మంచి గ్రహిస్తూ
హంసలా బతుకుతాను

మీరు చెప్పినట్లే
అన్నీ త్యాగం చేస్తూ
గోవులా సహిస్తాను

మీరు చెప్పినట్లే
పెద్దల మాటలు వింటూ
రాముడిగా వెలుగుతాను

మీరు చెప్పినట్లే
ఆడిన మాట తప్పకుండా
హరిశ్చంద్రుడిలా నిలబడతాను

కాని... నా దొక్కమాట
ఎదటివాడు మనిషైతే
మీ మాటే వింటాను
మనిషిరూపు పులి అయితే
నా పని నే చేస్తాను

*(యువకవిత, అక్టోబరు-డిసెంబరు 1985)*



# రోడ్డు బాధ

ఈ రోడ్డుకు
ఒంటి నిండా గాయాలే
ముఖం నిండా కత్తిగాట్లే

కుతకుత ఉడికిపోతూ
ఆవేదన వెళ్ళబోసుకుంటోంది సూర్యుడితో
కన్నీటిలో మునిగిపోతూ
కష్టాలు చెప్పుకుంటోంది మేఘుడితో

ఎమ్మెల్యే గారొచ్చినపుడల్లా
ఈ రోడ్డుకి పౌడరు పూసి
ముస్తాబు చేస్తున్నారు

మంత్రిగారొచ్చినపుడల్లా
ఈ రోడ్డుకి
స్వాగత ద్వారాల హారాలతో
మెడను అలంకరిస్తున్నారు

అయినా రోడ్డు బాధ
నాయకులకేం తెలుసు
ప్రజలకు తప్ప

*(ఆంధ్రజ్యోతి, 1-6-86)*



# ఎగ్జామినేషన్ హాల్

తలకాయలు
సముద్రంలో మునిగి
పారుతున్నాయి

కలాలు
పువ్వుల హృదయాలమీద
తేనె లొలుకుతున్నాయి

గది
నిశ్శబ్దం నిండిన కుండలా
తొణకదు

హఠాత్తుగా
అదృశ్య రాకెట్లు వచ్చి
నత్తలకు గుఱ్ఱపుకాళ్ళిచ్చి
క్షణాలలో పరిగెత్తిస్తాయి

వేకువనే
ముందింట్లో మొలుచుకొచ్చే
సూర్యుడి నెత్తిమీద కిరీటాలుగా
హాట్‌హాట్‌గా ప్రింటవుతారు నత్తలు

సముద్రంలోంచి
బయటపడలేక తన్నుకుఛస్తున్నారు
బాగా పరిగెత్తే
తలకాయ లున్న గుర్రాలు !!!



# అదృశ్య విషతుషారం

అవును, మనం ప్రస్తుతం
కోరలు సాచిన మంటలలో కూరుకుపోతున్నాం
అయినా ఈ సంగతి మనం
అంత తేలిగ్గా తెలుసుకోలేక పోతున్నాం
మన కంటికి కనబడటం లేదు
మన యిల్లు తగలబడి పోతుంటే
మనసు కన్ను తెరవకపోతే మనం చూడగలిగేది
పూర్తిగా యిల్లు బూడిదయ్యాకనే

నిజం చెప్పాలంటే మనం
లేలేత చిగురాకులమే
సున్నితమైన పుష్పాలమే
సుకుమార హృదయాలున్న
రస సమన్విత ఫలాలమే

అవును, మనం ప్రస్తుతం
కోరలు సాచిన మంటలలో కూరుకుపోతున్నాం
మన తప్పేమీ పెద్దగా లేకుండానే
దిక్కుల మధ్య ఇరుక్కుపోతున్నాం

మనమే మన యిల్లు కాల్చుకోటానికి
క్రమశిక్షణ లేని కట్టెపుల్లలం కాము
మనం మన తల్లినే కాల్చేయటానికి
నిప్పును మూతిమీద నిలుపుకొన్న సిగరెట్టులం కాము

వెండి ఆకాశంపై కదలాడే
వగలాడి తారల తళుకుబెళుకుల్ని
నోళ్ళు వెళ్ళబెట్టుకొని చూస్తున్న
"అమాయకం" కన్నుల్లారా!
ఆ శూన్యం మన మీద చల్లుతున్న
అదృశ్య విషతుషారం గమనించగలిగారా?

అవును, మనం ప్రస్తుతం
విష పాత్రలో పడిన పక్షులమైపోయాం
రెక్కలుండీ మనం
ఎగిరి వెళ్ళలేని మత్తులో పడిపోయాం

ఇంటింటినీ పూడ్చి పెడుతున్నాయి
వయసు ప్రదర్శన శాలలు అస్థిపంజరాల పెట్టెలు
పాటలు పాడుతూ
ఆటలు ఆడుతూ
దేశం గుండెగులాబీని తుంగలోకి నెడుతూ
గుండెను లాగేసిన చోటే ప్లాస్టిక్ గుండె పెడుతూ

అవును, మనం ప్రస్తుతం
గులాబీలను సమాధి చేస్తున్న శ్మశానంలో వున్నాం
పూలతోటల్ని సృజించుకోగలిగిన మనం
పువ్వుల్ని పారేసి పుర్రెల్ని
తలమీద అలంకరించుకుంటున్నాం

చీకటి వూబిలో నుండి
మానవతను లాగటానికి వెళ్తున్న
అక్షరదేవతల్ని "కిడ్నాప్" చేసి
లక్షలకు అమ్ముకుంటోంది వ్యాపారం
మానప్రాణాలను రూపాయిలుగా మార్చి
నింపుకుంటోంది ధనాగారం

అవును, మనం ప్రస్తుతం
డబ్బుకొండ నుండి బండరాళ్ళు జారిపడుతుంటే
అటే పోతున్న ఆవులం మనం
మనవెంట మన దూడలుకూడా
ఈ త్రోవలోనే వస్తున్నాయని గ్రహించటం లేదు మనం

ఒడిలో పంటల పసిపిల్లల్ని లాలిస్తున్న పొలాల్ని
వెయ్యికాళ్ళతో తొక్కుతోంది "ప్రపంచీకరణ" అంబోతు
పాలిచ్చే ఆవుల్ని
పనిచేసే ఎద్దుల్ని
కుమ్ముతోంది పొగరుబోతు

మనుషుల్లోంచి వచ్చే మనీషులు కావాలిప్పుడు
మనీషుల్లోంచి వచ్చే మూడో కన్ను తెరిచే
మహేశ్వరులు కావాలిప్పుడు.

మన యిళ్ళను తగలేసే సిగరెట్లను తరిమేయటానికి
మన మీద విషం చిమ్ముతున్న మంచును తుంచేయటానికి
పూల తోటలను శ్మశానాలుగా మారుస్తున్న తుఫానుల్ని
తుడిచేయటానికి
బండల్ని విసురుతున్న కొండల చేతుల్ని నరికేయటానికి
మనుషుల్లోంచి వచ్చే మనీషులు కావాలిప్పుడు
మనీషుల్లోంచి వచ్చే మూడోకన్ను తెరిచే
మహేశ్వరులు కావాలిప్పుడు

*(నైతిక విప్లవం, ఏప్రిలు '95)*



## చెల్లెళ్ళ కోసం

నీ ఒంటిలోని
మిసమిసలాడే వెన్నను
బలవంతాన కరిగించి
తాగేశాడు వాడు

నీ గుండెలోని
నవనవలాడే కోరికల్ని
కాలికింద తొక్కేసి
చింపేశాడు వాడు

నవ్వులపా లవుతానని ఏడుస్తూ
ఆత్మహత్యకు పాల్పడతావా యువతీ
దారిలో గుచ్చుకున్న ముల్లును విరిచి
దూరంగా పారేయాలని తెలియదా సోదరీ!

ఈ పోలీసులు
నిన్ను కాపాడలేదని
కంగారు పడకు !

ఈ కోర్టులు
అక్రమానికే లైసెన్సు లిస్తాయని
దిగులు పడకు !

ప్రజలలో ఉండే ధైర్యమే
ప్రతి సమస్యకు పరిష్కారం
సమస్తసమాజ సైన్యంలో చేరు !
రుద్రకాళివై పోరు !!

(విశాలాంధ్ర 29-4-84)



# బాధ

బాధల హిమాలయాలెక్కి చూస్తుంటే
అడుసులో గిలగిలా కొట్టుకుంటున్న
చేప పిల్లలా నా దేశం

గుళ్ళల్లో మంటలు చెలరేగుతున్నా
నోరు మూసుక్కూర్చున్న ఫైరింజను ప్రభుత్వాలు
రాజకీయాలు కలిసేసరికి
నదుల నీళ్ళ కెన్ని రంగులో!

నిజంమీద ఆయుధాలు ఝళిపిస్తున్న పచ్చనోట్లు
ప్రజాస్వామ్య పడతికి శిరోముండనాలు
అవినీతి రోగ నిలయాలైన ఆఫీసుల ఒంటిమీద కట్టుకొన్న
తాయెత్తుల్లాంటి జాతీయ నాయకుల ఫోటోల్లా
మనుషులు తమ ముఖాల మీద
తగిలించుకుంటున్నారు చిరునవ్వులు

వేకువనే పుట్టుకొచ్చిన పేపరు పసికందు చెపుతుంది
పట్టపగలు పండగల గుండెల్లో కత్తి దిగిందన్న వార్తలు
అధికారం పులితోలు కప్పుకొన్న గాడిదల రంగు బయట
పడకుండా
పరిస్థితి అదుపులోనే వుందంటున్న రేడియో చిలకలు......

బాధాగ్నుల్లో మన జీవితాలు
బంగారంలా కాలుతున్నా యిప్పుడు,
విలువైన ఆచరణ ఆభరణాలను
ఆగామివ్యవస్థ మెళ్ళో అలంకరించేందుకు.

*(చైతన్య కవిత - 4 Autumn 1987)*

# భయం

డబ్బుకోసం గడ్డి తినేవాణ్ణి దమ్ములున్న మొనగాడంటున్నారా!
నీతిగా పనిచేసుకుపోయేవాణ్ణి పిరికిగొడ్డుగా జమకడతారా!

★ ★ ★ ★ ★

ప్రజలంతా తనకు
పాదాభివందనాలు చేయలేదేమని భావించటం భయం
స్వీయ వ్యక్తిత్వ స్పృహవచ్చి నిద్రిస్తున్న ఈ మనుషులు
ఎదురు తిరిగి నిలబడతారని సెంటిమెంట్ల మత్తుచల్లటం భయం
గుండెల్ని తాకట్టుపెట్టి మల్లెపూల తోటల్లోకూడా
గూండాల రక్షణలో తిరగటం భయం
దూసుకొస్తున్న లేళ్ళ సెలయేళ్ళమీద
పెద్దపులులు లారీలు ప్రయోగించటం భయం
విద్యుత్ప్రవాహాల్ని మోస్తూ పిడికిళ్ళు బిగిస్తున్న స్తంభాల్ని
చట్టాల బుల్‌డోజర్లతో పడగొట్టటం భయం
పాదస్పర్శతో పొలాలను పవిత్రక్షేత్రాలుగా మార్చే వృషభరాజాలు
చర్నకోల లేకపోతే మాట విన వనుకోవటం భయం
ధనాధికారాలతో బొజ్జలు పెంచుకొంటున్న అడ్డుకట్టలు
ఆకలి పొలాల్లోకి నడుస్తున్న నీళ్ళకాళ్ళను విరగ్గొట్టటం భయం
మనస్సుకు మనస్సుకు మధ్య నమ్మకం వంతెన నిలవకుండా
అనుమానం వరదల్ని సృష్టించటం భయం
భవిష్యత్తు పొలాల్లో స్వర్గం మొలకెత్తిస్తామని
వాగ్దానాల పుచ్చుగింజల్ని విచ్చలవిడిగా వెదచల్లడం భయం
ఊరికి వస్తున్న తరంగాల్ని విభజించి పాలించాలనుకోవటం భయం

ఉదయిస్తున్న సూర్యుణ్ణి ఉరితీయాలనుకోవటం భయం
నిజం చెప్పే నోళ్ళు మూయించాలనుకోవటం భయం
ఆపరేషను టేబులుమీద దేశమాత చావుబతుకుల్లో ఉంటే
తెల్లకోట్లు తమ ప్రతిభను రూపాయిలతో కొలవమనటం భయం
డిగ్రీల బండరాళ్ళ కింద సంస్కార పుష్పాన్ని నిర్దాక్షిణ్యంగా
బలిచేసి
ఏమి తెలియనట్లు నటించటం భయం

★ ★ ★ ★ ★

గడ్డి తినకపోవటం భయం కాదు
వెలుతురు దారిలో నడవటం భయంకాదు
గుండె జైల్నుంచి నిజాల్ని విడుదల చేయటం భయంకాదు
మనసుల్ని పండించటానికి చైతన్యం విత్తుల్ని చల్లటం
భయంకాదు
కాలం రోడ్డుమీద నడుస్తున్న మంచితనం ముసలాయనికి
చెయ్యందించి నడిపించటం భయంకాదు
జనాన్ని భయపెట్టాలని
భయపడుతూ చస్తున్న
పులితోలు కప్పుకొన్న గాడిద ఈ వ్యవస్థ
మన ఎక్కుపెట్టిన విల్లు పూరించాలి దీని కథ

*(ఆంధ్రభూమి, 10-10-87)*



# ఆగ్రహ గీతం

ఆ ఆఫీసు పరిసరంలోకి అడుగుపెడితే చాలు
ఆ గేటుకా డున్నవాడు నీ జేబును ముందు నాకుతాడు!

జేబు కనబడకుండా జాగ్రత్తగా లోపలి కెళ్లావనుకో
అక్కడ కాచుక్కూచున్నవాడు నీ చొక్కాను మెత్తగా నాకుతాడు!

జాగ్రత్తగా దాచుకొని ఇంకా లోపలికి పోయావనుకో
నీ కోసమే కుర్చీలో ఎదురుచూస్తున్నవాడు నీ పంచెంతా
నాకుతాడు !

ఇంకా జాగ్రత్తపడి ఏ.సీ రూములోకి కదిలావనుకో
సూటేసుకున్న నీటుగా డొకడు నీ అరికాళ్ల నాకుతాడు!

బంగినపల్లి పండులా లోపలి కెళ్లినవాడివి
ఎండినపోయిన టెంకలా బయటపడతావు
అంతమంది నిన్ను
అణువణువూ నాకేసరికి

★ ★ ★ ★ ★

నా ఫైలు గులాబీపూలమాల
సువాసనలు వెదజల్లుతున్నదన్నావనుకో !
చూపుల కాళ్ళతో బురదపూసి
'ఇంత బురద నీదేనా' అంటాయి బలిసిన పందులు...
నా ఫైలు పున్నమిచంద్రబింబం
అమృతం వెన్నెల ప్రసరిస్తుం దన్నావనుకో!
'రూలు'లోంచి తీసిన 'మురికి' రాసి
ఇంత కంపులో ఎలా బతుకుతున్నా వంటాయి అడ్డగాడిదలు...

ప్రభుత్వాలెన్ని మారినా
మారని వ్యవస్థను చూస్తూ
చావలేక బతికివున్న కురువృద్ధులు
సచివాలయం ఆవరణలో చెట్లు

బరువు పెట్టకపోతే
అట్టడుక్కిపోయే కాగితాలు
నెత్తిమీద నువ్వెంత బరువు పెడితే
అంత వేగంగా పైకి లేచి పరుగెత్తుతాయి

ఈ రాజయోగుల కళ్లల్లో క్షామం
అభాగ్యగతుల జేబుల్లోని
పదహారణాల పడుచుదనం లాంటి
పచ్చనోట్ల కోసం...

మంత్రుల వాగ్దానాల కన్నెలు
జీవోల వరులకోసం ఎదురుచూసీ ఎదురుచూసీ
వయసుడిగి కాలంచేస్తే కాల్చేసే శ్మశానం ఇదే,
కుర్చీల గజ్జిచేతులు
మనుషుల రక్తమాంసాల్ని పిండీ పిండీ
'హాట్‌డ్రింక్'గా 'ఉచ్ఛ'స్థితిలోకి మార్చుకొని తాగే
గబ్బు 'క్లబ్బు' ఇదే

★ ★ ★ ★ ★

మన రోడ్డుకు గుంట లెందుకు పడతాయో తెలుసా!
చైర్‌మన్‌గారు, కంట్రాక్టరుగారు అదే పనిగా రోడ్డును
నాకుతుంటారు...
దేశంలో ఇన్ని రకాల కరువులెందుకు వస్తున్నాయో తెలుసా!
నాయకులు, అధికారులు అదే పనిగా దేశాన్ని నాకుతున్నారు...

మంత్రులు ముఖ్యమంత్రులు నాకుతుంటేనే
ఉద్యోగాల సంఖ్య చిక్కిపోతోంది...
పోలీసులు లాయర్లు నాకుతుంటేనే
ధర్మదేవత పీక్కుపోయి ఎండిపోతోంది...

అందరూ ఇలా నాకీ నాకీ
మేము పట్టుకున్న జండాను మింగేశారు
మా కిక మిగిలిం దొకటే
చేతిలో గునపంలా జండా కర్ర

నాకటాన్ని కూడా కళగా మార్చిన నటశేఖరులారా!
నేటితో నూరు తప్పులు నిండిన ఓ శిశుపాలుల్లారా!
మా చేతుల్లో ఈ ఆయుధం
మీ పాలిటి విష్ణుచక్రం.

*(1986)*



# కొత్త సంవత్సరం

కత్తి కొనమీద
మల్లె విరిసింది
మంచు గుండెలో
వెలుతురు రాక

సముద్రంతో
మరోనది మనసు కలిపింది
విశ్వజల పరిమళం
భూమిని ముద్దాడటానికి

ఇప్పటిదాకా మేలుకొన్న శిల్పం
ఇక శిలలా నిదురపోతుంది
కొత్తబరువు రాయిని
నీ చేతి ఉలిమీద వదిలేసి.

*(1997)*